# హరిహరనాథ శతకము





(మతము)

అనుబంధములో

రచయిత :

మహమ్మద్ హుస్సేన్

టీచరు,

దొరసానిపాడు,

(వయా) భీమడోలు

పశ్చిమగోదావరిజిల్లా.

(శ్రీ కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, వేదవిద్యావిశారదేత్యాది
మహాబిరుదవిరాజమానులు



శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, రాజమండ్రి.)

# అభిప్రాయము

## హరిహరనాథ శతకము

ఇది ద్వారకా తిరుమల సమీపములోనున్న దొరసానిపాడను గ్రామములో సెలిమెంటరీ స్కూలుమాష్టరుగానున్న మహమ్మద్ హుస్సేన్ అను మహమ్మదీయ కవి రచించెను. ఈ కవి నాకు 20 సంవత్సరములనుండి పరిచితుఁడు. శిష్యప్రాయుఁడు. నాయందు మిక్కిలి దయగలవాఁడు. ఇతఁడు గర్వములేనివాఁడు. సజ్జనులలోఁ జేర్పఁదగినవ్యక్తి. మహమ్మదీయుఁడయ్యు నితర మతముల నిరసించువాఁడు కాఁడు. అందులకీ శతకమే సాక్ష్యము.

ఈ కవి రచనము మిక్కిలి సరళము. కవిత్వము
ధారాళముగా, గుంటుపడక మనోహరముగా
నుండును. నేనీశతకము అట నట జూచితిని.
చక్కని కల్పనలతో, భక్తిరస ప్రధానముగా నున్నది.

ఎటులేని యల్పదోషములున్న నవి పరిగణింపబడునవికావు. ఈ మహమ్మదీయకవి యిదివరకు 10, 15, గ్రంథములు చేసియున్నాడు. మన యాంధ్రసోదరులీ కవియందును, ఈతని రచనములందును ఆదరము చూపుదురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు,

రాజమండ్రి.
౪—8—59,

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ఆస్థానకవి.

(శ్రీయుతులు పి. బాలకృష్ణగారు
B. D. O., భీమడోలు.)

# అభిప్రాయము

శ్రీ షేకుమహమ్మద్ హుస్సేన్ నా కత్యంత సన్నిహిత కవులలో నొకరు. కవిసార్వభౌమ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి శిష్య కోటిలో నొకరు. అట్టి వారికవిత్వ విశిష్టతనుగూర్చి యభిప్రాయము వ్రాయుట నా బోటివారికి సాహసమే యగును. అయినను కవి యెడల నాకుగల యభిమానమును బురస్కరించుకొని యొకటి రెండు మాటలు చెప్పకుండ నెట్లుండగలను ?

ఆంధ్ర సాహితీ ప్రపంచములో నెందరెందరో కవులు పలువిధము లైన శతకములు రచించియున్నారు. అందు కొందరు భక్తులు, కొందరు రసికులు, మఱికొందరు సంస్కర్తలు, ఇంకను కొందరు పండితులు, కలరు. వారు తమ తమ అభిరుచులను, ఆశయములను, ఆదర్శములను, భక్తిని తమ శతకములలో నిరూపించుకొని యున్నారు. కొందరు యువకవులు తమ ప్రారంభ కవిత్వములో శతకములు వ్రాయుటకూడ కద్దు. అందుచేతనే పెక్కుశతకములలో మనకు సరిక్రొత్తభావములు వినూత్న పోకడలు, గాన వచ్చును.

శ్రీ మహమ్మద్ హుస్సేన్ రచితమైన 'హరిహరనాథ' శతకము మన చేతికందిన తృతీయ ముద్రిత గ్రంథమే కాని తృతీయ రచన మాత్రము కాదు. పెక్కు రచనలు సాగించిన దిట్టతనము మనకిందు గట్టిగా కనబడు చున్నది. ఈ శతకము కవియొక్క మధుర మంజులమైన శైలిని నిరూపించు చున్నది. ఉదాహరణకు : 17 వ పద్యము

అడుగడుగున నొడలెరుగని
వెడగు నహంకృతిని గడపి, వెడలగ బెదరక్
ఎడనీయెడ నూడిపడ, నెవ్వ
డడరెడు నెడనెడపి నడుపు, హరిహరనాథా.

80 వ పద్యము

అడుసునబడి చిడిముడిచే
గడగన బడకడలు బడుగు కైవడి బుడమిన్

గడు నిడుములబడి యడలుదు
నడరెడు చెడుగులకు జడిసి హరిహరనాథా.

ఈ పద్యముల, యమకము, నడక, రసజ్ఞు లూహింతురుగాక. 20 వ పద్యము చూడుడు.

ఇదికా దదియను, నదికా
దిదియను, నిదియదియు వదలి యెదిరో పదరున్
వదలని ముదముఁ బొదలఁగ
నదవదపడి చెదరి యెడఁద, హరిహరనాథా.

ఇంతటి అందముగా కందమును మన కందించినందులకు నాకెంతేని ఆనందముగానున్నది. ఇట్టి ఉదాహరణము లీయవలనన్న శతకములో పెక్కులు రతనము లున్నవి. పాఠకులు స్వయముగా బరిగ్రహింతురు గాక!

ఇది కవిభక్తి సమర్పిత భావ ప్రసూనము. భక్తుడు గాఢ సంతాప భరితుడై తిన్న తానెట్లు భగవంతునికి సమర్పించుకొనునో యిందు సుబోధకమగుచున్నది. ఒక్క మాటలో చెప్పవలయునన్న ఇందు భక్తకవి పోతన్నను స్ఫురింపజేయు భాషా, భావ, రచనా పరంపరలు పఠితృ మహాశయుల నానంద పరవశుల గావించును.

ఉదహారణకు : 5 వ పద్యము

కందంబులు, భక్తి రసా
నందంబులు, నవరసార్ద్ర నానాగుణమా
కందంబులు వరశిల్పపు
టందంబులు స్వీకరింపు, హరిహరనాథా.

6 వ పద్యము

కందమ్ములు, లోఁజూపుం
గందమ్ములు, తెన్నుగొనవు గందమ్ములు, బల్
బిగదమ్ములు మణిబొమల,
కందమ్ములు తెనుఁగు నుడికి హరిహరనాథా.

7 వ, 8 వ పద్యముల నడకకూడ పోతన మహాకవి ననుసరించిన జాడ గన్పట్టుచున్నది.

ఇట్టి శతకములు నిత్యము పఠించిన, భాష, భావము, భక్తి, జ్ఞానములు, సంఘములో విస్తరించగలవని నాయభిప్రాయము. కాన సంఘ శ్రేయోఽభిలాషులు, విద్యాపోషకులు, ఈ శతకమును ఆదరించి తన్మూలముగా, కవిని, ప్రోత్సహించి, ఇట్టి రచనములు పెక్కులుసాగించుచు ఆంధ్ర భాషామతల్లికి సేవచేయు మహాద్భాగ్యమును వీరికి కలిగించెదరుగాక ! నేటి వరకు అజ్ఞాతకవిగా ఉన్న శ్రీ మహమ్మద్ హుస్సేన్ అచిరకాలములో, అనేక కృతులను రచించి, అభ్యుదయ కవిగా పేరందుటకు "అల్లా" తోడ్పడునుగాక.

పి. బాలకృష్ణ
భీమడోలు

# అభ్యర్థన

శ్రీకి వన్నె వాసి చిలికించు వర "గార
పాటి" వంశమునకుఁ బాటిగూర్ప
నమర కృతిరచించు 'హైమవతీదేవి'
సాదరమున నా జోహారు గొనుము ! ౧

చల్లని యుల్లం బెల్లపు
డుల్లసిలం జాలు తల్లి ! యుష్మత్కరుణా
పల్లవిత కథలు వినగా
ఫుల్లంబై కవుల మనము పొంగునఁటు! భళీ! ౨

విన్నాఁడ భవదుదారతఁ
గన్నాఁడను మిమ్ము మున్నుగా, మాదుపురిన్
ఉన్నాఁడఁ, దలఁపు సఫలత
చెన్నారునఁటన్న యాశ, శ్రీతకల్పకమా ! 3

కమ్మని కందమ్ములు, బల్
సొమ్మై మనమ్మునకుఁ గ్రమ్మ నీసమ్ముల భా

వమ్ములు శతకమ్మయె, నో
యమ్మా ! సాయమ్మొసంగుమా ! యచ్చునకున్. ౪

హరి హరనాథ స్మరణ
స్ఫురణం, బాధ్యాత్మిక ప్రబుద్ధ విశుద్ధం,
బరయుము, మద్రచితంబిది
హరిహరనాథ శతకము, మహత్కృతి చరితా ! ౫

వందలు వేలును బ్రతిదిన
ముం ద్రణముం బలె వ్యయింపఁ బూనెడు, మీరల్
డెందమున దలంచినఁ జే
రందగునో ? దైవశతక మచ్చొనరింపన్. ౬

ఆశుకవిని గాను, హాస్యచాతురిలేదు,
గర్భబంధ చిత్ర కవిత రాదు
దేవదేవుఁడిచ్చు భావభక్తి ప్రేర
ణంబు మామక కవనంబు డంబు. ౭

ఇది స్వార్థపరతఁ గూర్చిన
యదికాదు, పరాత్పరుండు, హరిహరదేవున్
మదిఁ బొదలఁ జేయునది మీ
యెద నచ్చుం గూర్పఁ దలపుడీ ! శుభమగుతన్. ౮

ఏలిరి ప్రాజ్యరాజ్యము మహేంద్రులనందగి, భారతావనిన్,
ద్రోలిరి వైరి వీరులను దోర్బలశౌర్య పరాక్రమోన్నతిన్,
జాలిరి కోవిద ప్రతతి సన్నుతులంద, నమందకీర్తులై,
ఏల యణంగు ? దద్గుణము లిత్తరిఁ, గమ్మని కమ్మవారిలోన్. ౯

దొరసానిపాడు,
10—8—60.

ఇట్లు,
మహమ్మద్ హుస్సేన్.

# నా అభ్యర్థనపై, శ్రీమతి గారపాటి హైమవతీదేవిగారిచ్చిన
# యమూల్య సందేశము

మీ కవితాభిలాష, ఆధ్యాత్మిక చింత, ఆనందమిచ్చినవి. మానవులకు నైతిక జీవన లబ్ధియే పరమావధి కాగూడదనుట నిజము; నైతిక శక్తికి ఆధ్యాత్మిక చింతనము కూడ తోడైనపుడు, మానవకల్యాణమునకు తోడ్పడగల భూతదయ, పరోపకారశీలము, పెంపొందుననుట నిస్సంశయము. మానవ కల్యాణమునకు ధనమే ప్రధానమని తలంచరాదు. అది అనేక రూపముల రూపొందగలదు.

మీరు, కవితారూపములో, మానవకల్యా
ణమునకు విజ్ఞానదాయకముగా వికసించు
మీవాణి ద్వారా, మానవుల అజ్ఞానమను
అంధకారమును తొలగించుటకు దోహదకా
రులు కాగలరు. అందు ఆర్థిక-సహాయమునకై

మహోదారమూర్తులనుగన్న, ఆంధ్రావని రిక్తపోదు. మీ ఆశయ సిద్ధికి తప్పక తోడ్పడగలదు.

విద్యయందు నాకు ఉన్న అభిలాష చొప్పున, మీవంటికవుల గ్రంథ ముద్రణారూపమునకై నా "సీతారాముని" ఆజ్ఞ ప్రకారము రు. 116/ నాద్వారా మీరు గ్రహింపవచ్చును.

దెందులూరు,
2—9—60.

ఇట్లు,
గా. హైమవతీదేవి.

అనన్యవదాన్యశేఖరులు, కేవలకీర్తివాంఛాపరులు, ఉదారమనస్సంపన్నులు,

# శ్రీ మావులేటి సోమరాజు గారు

గుండుగొలను.

శ్రీ సముల్లసద్విశేష బిడౌజ! వ
దాన్య కల్పభూజ! స్తవ్య భవ్య
మావులేటి వంశమహితాబ్ధిరాజ! వి
శుద్ధకీర్తి భోజ! సోమరాజ! ౧

అతి నిరాడంబరంబు జీవితపథంబు;
సత్ఫలప్రదంబు, భవదాశయ చయంబు;
కృతులు శాశ్వతబుధనుత కీర్తి నిధులు!
భళిర మిమ్ము నుతింప నేపాటివాఁడ. ౨

సుజన విధేయుఁడు.

మహమ్మద్ హుస్సేన్.

# ఆకాంక్ష

స్వార్థప్రేరిత మతినై
వ్యర్థాలాపంబు లేవొ, వాగెదు నన్నున్
సార్థీకృత జన్ముఁడుఁగా,
నర్థింతు, ననుగ్రహింప, హరిహరనాథా. ౧

నీ కరుణించిన ఘుటికయు,
నా కలుషిత జీవితమున, నాకొంబగుటన్
నా కల్పించెడు కృతి సఫ
లాకరమగు వరము నిమ్ము, హరిహరనాథా. ౨

వెలి చూపును లోఁజూపును
వెలివోని సుధీబలమ్ము విలసించు సము
జ్జ్వల ఫాలజ్యోతిని నా
కలవడ, నిలఁబడ, నొనర్పు, హరిహరనాథా. ౩



ఓం

# హరిహరనాథ శతకము

౧

కం. శ్రీకరమై, నీ నామము
ధీకరము నగణ్య పుణ్య దీప్తికరమ్మై,
లోకోత్తర శీలకర
మ్మై, కావుత మమ్ము నెపుడు, హరిహరనాథా!

౨

కం. భక్తి ప్రధాన నిర్మల
రక్తిన్, యుష్మత్కృపాతరంగిత దివ్య
చ్ఛక్తిని గొని యనుపమ స
మ్యక్తృప్తి రచింతు దీని, హరిహరనాథా.

3

కం. భారత మంతటి గ్రంథము
నేరుపుమై వ్రాసి కృతిగ నీ కిచ్చుటకై
పార ప్రతిభారిక్తుఁడ,
నారసి దీనిం గ్రహింపు, హరిహరనాథా.

౪

కం. ఆరోగ్య భాగ్యమిడి, నను
గారామునఁ గాచినావు గావునఁ గవితా
నీరాజనం బొసంగెద
నారయుమిది "యుడుతభక్తి", హరిహరనాథా.

౫

కం. కందంబులు, భక్తిరసా
వందంబులు, నవరసార్ద్ర నానాగుణమా
కందంబులు, వరశిల్పపు
బందంబులు, స్వీకరింపు, హరిహరనాథా.

౬

కం. కందమ్ములు, లోఁ జూపుం
గందమ్ములు, లెస్సగొనపు గందమ్ములు. బల్
బందమ్ములు మఱుబాముల,
కందమ్ములు తెనుఁగునుడికి, హరిహరనాథా.

౭

కం. నీ కరుణ, కృతార్థ సుధా
సేకరణ, మఖర్వ వృజిన జీమూతవిశు
ష్కీకరణ, మపూర్వ ప్ర
జ్ఞాకరణ, మకారణముగ, హరిహరనాథా.

౮

కం. పాపంబులు, మత్కృత్యా
పూపంబులు, స్వార్థవిషయ భోగాభోగా
వాపంబులు, నానాజ
న్యావద్రూపంబు; లడఁచు, హరిహరనాథా.

౯

కం. కవి "ముసలి"మ్మట! వ్రాసెడు
కవనము తాను తెనుఁగునట! కవితా ప్రభువో!
భవహర! హరిహర పతివఁట!
హవణిల్లెసుంత వింత! హరిహరనాథా.

౧౦

కం. పద్యమ్మొక 'వరహా' గా,
హృద్యమ్మై, పాఠకులకు నిహపరహిత సం
వేద్యమ్మై, ముక్కారమున
కాద్యమ్మై, యలరుగాత! హరిహరనాథా!

౧౧

కం. హరి దేవుండని కొందఱు
హరుఁడే విభుఁడంచుఁ గొందఱందురు; నీవో
యిరువెగల, శఖిల మతముల
నరిగెదు వారలకుఁ బతివి, హరిహరనాథా.

౧౨

కం. అలఘు సమీరాహతిచేఁ
జలితంబగు పర్ణమట్లు స్వాంతము విషయా
కులమయ్యె. విశంకట వి
హ్వాలమయ్యె, వివేకమిమ్ము, హరిహరనాథా.

౧౩

కం. కలుషాచిత కామాగ్నికి
శలభమనై, విగ్రహాత్మ సందగ్ధుఁడనై,
గళిత స్వత్వుఁడనై తిని
నలసుఁడఁ, దన్ముక్తినిమ్ము, హరిహరనాథా!

౧౪

కం. క్రోధంబధముని విత్తము
క్రోధము బాధాకరంబు, కుటిలవ్యాపా
రైధిత సాధన, మేతద్
వ్యాధి విముక్తునిగఁ జేయు హరిహరనాథా.

౧౫

కం. భీకర మాత్సర్యాత్మక
కాకోదర రూపమింత గన్నంతన, బెం
దై, కాయము వడఁకెడు నీ
కా! కావుము సహన మొసఁగి, హరిహరనాథా.

౧౬

కం. శాత్రవులకన్న, నంత
శ్శాత్రవషట్కంబు మిగుల సంక్షోభ మిడున్
రాత్రిందివములు వేఁదెద
నాత్రమ్ముమెయి; నన్నుఁగావు, హరిహరనాథా.

౧౭

కం. అడుగడుగునఁ దొడరెడునా
వెడఁగు నహంకృతిని గెడపి, వెడలఁగ బెడదల్,
ఎడ నీయెడ ముడిపడ, నెపు
డడరెడు వెత నెడపి నడుపు, హరిహరనాథా.

౧౮

కం. కీడెంచిగాని ఐల్మేల్
జూడం జూడం గడంగఁ జాలని యీ నా
పోడిమి కేరడమయ్యెడు
నాడికలెడనెడగ నడుపు, హరిహరనాథా.

౧౯

కం. పాపపుఁ దలఁపుల తూపుల
రాపుల కోపక, వివేకరత్నము తూఁన్గెఁ,
నాపసను రూపు మాపెదు,
నాపన్నుఁడఁ బ్రాపుఁ జూపు, హరిహరనాథా!

౨౦

కం. 'ఇదికా' దదియును, 'నదికా'
దిదియను, నిది యదియు నదలి యెదియో నదరున్
వదలని మదములఁ బొదలఁగ,
నదవదపడి చెదరి యెదఁద, హరిహరనాథా!

౨౧

కం. పతితుఁడు బునీతుఁడగునా!
యతి వక్రము శ్వానపుచ్ఛ మకుటిలమగునా!
యతివస మధురంబగునా!
యతులాఘౌఘావరోధ! హరిహరనాథా!

౨౨

కం. కోఁతికి మృదు సుమమా! యెను
బోతుకుఁ బన్నీటి జలమ! భూదారము సం
ప్రీతిఁ గనఁ దల్పమా! నా
కా! తత్త్వ జ్ఞానమోటు, హరిహరనాథా!

౨3

కం. ధన సంపాదనమున మన
మెనలేని జవంబు సూపు, నెవ్విధి బలమో!
నిను సేవింపఁగఁ జనుమన
ననుకూలింపదు సుమంత, హరిహరనాథా!

౨౪

కం. వేయి పుటమ్ములు వెట్టిన
నా యజ్ఞానము దొలంగునా ? నీ కరుణా
పీయూషమింత జుబ్బిక
హాయిగ మతినిన్నుఁ గనక, హరిహరనాథా !

౨౫

కం. చిలిపితలంపుల కంపుం
జిలుకుచుఁ బెంపారునెడ్డెచేతల యెడఁదన్
మలచి సరిదిద్దఁ గలనా !
యలఘుదయాం బుజపుమయ్య ! హరిహరనాథా !

౨౬

కం. ఆక్కజపు నింగి రిక్కల
లెక్కను దక్కువలు సేయులే, నా దొసఁగుల్
ఉక్కుపెడెఁ బెక్కు యతనము,
లక్కునఁ గ్రక్కున గదింపు, హరిహరనాథా.

౨౭

కం. కలిగిన కొలఁది దురాశా
జ్వలితమ్మై, వికలభావ భరితమ్మై, వి
ష్ఫల చరితమ్మై, మతిసెడు
నలరింపుము పెంపువింపి, హరిహరనాథా !

౨౮

కం. నాచేఁ గదలదు మెదలదు
సూచిక పుల్లయును, వట్టిపోడుములేలా !
నీ చెయిది విశ్వ సృజనము
యాచించెద నీదు కరుణ, హరిహరనాథా !

౨౯

కం. తాఁ గూరుచున్న కొమ్మం
జేగొడ్డలిఁ బూని నఱకు చెనటిని, గామో
ద్వేగ వ్యసనగ్రసితుఁడ,
నాగడమిది, దీనిఁ దొలఁచు, హరిహరనాథా.

౩౦

కం. పదమెత్తి వైచులోపలఁ
గదిసెడు ఘటనా విశేష కర్మఫలంబుల్
మది గుఱుతింపంగలనా?
యద వదలఁ దొలంచుమయ్య! హరిహరనాథా.

౩౧

కం, ఇరులంబడి చీకుంబలె
నరిగెడునెడఁ గన్నులున్న యా ఫలమేమీ!
విరిసెడు నీ కరుణాప్రభ,
లరయఁగవలెఁగాక మమ్ము, హరిహరనాథా;

౩౨

కం. కనుఁ దెఱచి జాగరూకతఁ
జనఁగలనా? బెత్తెఁడైన, స్వవిధిపథానన్,
గనుమూసినఁ గనుఁ దెఱచిన
ననయము నీ ప్రాపుజూపు, హరిహరనాథా!

౩౩

కం, పరసంపద్వైభవ, మే
నరసినయెడఁ బళ్ళు పులియునట్టి కుసంస్కా-
రరతం జేనాఁటిదయా!
యరమర విడనాడి ప్రోవు! హరిహరనాథా!

౩౪

కం. ఇంగువ ముడువగఁ దావులు
బొంగెడు వలువట్లు పూర్వపుం బాముల, నా
రంగు గుబులొక్కొను జీవిత
మంగుగ సరిదిద్దుమయ్య! హరిహరనాథా!

౩౫

కం. రసనాగ్రంబున నీ నా
మ సుధా మాధుర్యరుచులు మలయఁగఁ, జిత్తం
బసమవ్యర్థ స్వార్థ
వ్యసనంబునఁ జిక్కెఁ; గావుఁ హరిహరనాథా!

౩౬

కం. శరణమయా! కరుణామయ!
శరణమయా! పాపనాశ! సకలాధీశా!
శరణమయ! భక్తసముదయ!
యరుదగు నీ ప్రాపునిమ్మ! హరిహరనాథా!

౩౭

కం. ఇదియిటు బోధముట సంగత,
మదియటు ఘటియించు టొప్ప దని వెంగలినై,
మదిఁ దలఁతుగాని నామే
లదిరా! యెఱుఁగుదువునీవ! హరిహరనాథా!

౩౮

కం. అనుజున కారోగ్యంబిడి,
మనిచితివి ప్రభూ! కృతజ్ఞ మతినై, పిశితా
శనము విసర్జించెద, నా
యనుచిత గుణమొకఁడు హాయ, హరిహరనాథా!

౩౯

కం. ఎదియున్నను జన్నను, నా
విదిత వివేకాత్త చిత్త విప్పులమునకున్
గొదగల్పింపకుమా? యెద
నదటును మొదలంటఁ ద్రుంచి. హరిహరనాథా!

౪౦

కం. ఏనాఁటి కుసంస్కారమొ!
మానక చెడు చెయిదములందు మరఁగెడు, నన్మ
న్మానసము, దీనిఁ గాదన,
నౌననఁ జాలదు బలంబు. హరిహరనాథా.

౪౧

కం. ఏనాఁటి కుసంస్కారమొ!
హీనుఁడు మానస నరేశుఁ డింద్రియ భటులన్
ఏన పథంబుల నడపెడు
హానిని గ్రహియింపలేమి, హరిహరనాథా.

౪౨

కం. ఏనాఁటి కుసంస్కారమొ!
జ్ఞానుల సాధువుల పుణ్యసంగతి యున్నన్
మానస మోర మొగంబిడు
నౌననదు తమ్ముక్తులెన్న; హరిహరనాథా.

౪౩

కం. నీ యాజ్ఞా మాత్రమ్మునఁ
బాయక యనుకూల వృష్టి వారిదుఁ డిచ్చున్
వాయువు నిలువక పరువిడు
నాయతలోకార్థ విధికి. హరిహరనాథా!

౪౪

కం. నీ యాజ్ఞా మాత్రమ్మునఁ
బాయక వేఁడియును వెలుఁగు జ్వాలనుండొనఁగున్
ఛాయాపతి నిల సుప్తైదు
నాయతలోకార్థ విధికి, హరిహరనాథా!

౪౫

కం. నీ యాజ్ఞా మాత్రమ్మునఁ
బాయక సప్తార్ణవములు స్వామితుల మెలఁగున్
రోయవు తమలవణత్వం
బాయతలోకార్ణ విధికి, హరిహరనాథా!

౪౬

కం. నీ యాజ్ఞా మాత్రమ్మునఁ
బాయక భూతంబులైదు స్వస్వప్రకృతి
స్సాయద్ధర్మములలరుచు
నాయతలోకార్థవిధికి, హరిహరనాథా!

౪౭

కం. నీ యాజ్ఞలేక చీమయు
నే యాకును గదలఁజాల దీ విశ్వంబుల్
నీ యొక తలఁపున నిలిచె న
యా! యద్భుతగతులు వెలఁగ, హరిహరనాథా!

౪౮

కం. త్రికరణశుద్ధిగ నీ నా
మ కథా సంస్మరణర క్తిమానవి స క్తిం
బ్రకటించు మనోబల మి
మ్మకలంకమ్మునఁ దలంతు, హరిహరనాథా!

౪౯

కం. బలవంత మెంత చేసినఁ
బలుకదు, నులుక, దమరక్తిఁ బడయదు భక్త్యు
జ్జ్వలదామోదము మూర్ఖాన,
దలయించు మనంబు మిమ్ముల, హరిహరనాథా!



౫౦

కం. బలవంత మెంత చేసిన
విలుపదు నీయందు భక్తిఁ నియతి లవంబున్
అలఘుతరైహిక సుఖముల
నలరెడు నా చెనటి యెడఁద, హరిహరనాథా!

౫౧



కం. బలవంత మెంత చేసినఁ
బలియింపఁ దపార భోగసక్త వికారో
జ్జ్వలమై యదలుచు నామన,
మలరించుము నీదుభక్తి, హరిహరనాథా.

౫౨

కం. బలవంత మెంతచేసిన
విలువదు గట్టుతెగు నేటి నీటింబలెఁ జం
చలమై పర్వెడు, విషయపు
టలలందేలుచు మనంబు, హరిహరనాథా.

౫3

కం. బలవంత మెంతచేసిన
వలదనదయ్యా! మనంబు పరవిత్తములన్
తెలఁగి సుధవోలెఁ గ్రోలఁగ,
నలఘు ప్రేరణ మొనర్చు, హరిహరనాథా!

౫౪

కం. బలవంత మెంతచేసిన
వలదనదయ్యా ! మనం బబద్ధములాడన్
దులకించెదు, విదలించెదు,
నలయక ప్రేరేచుఁగావు, హరిహరనాథా !

౫౫

కం. విరతము సత్సంకల్పో
త్కారముల కొదువేమిలేక, కలుషపుఁదలఁపుల్
దరిఁజేరనీక, నామది
నరసి, యొరసి, సంస్కరింపు, హరిహరనాథా.

౫౬

కం. కనుమూసినఁ గనుఁదెఱచినఁ
గనవచ్చు భయంకరాఘ కర్మములు, మలం
బున మనియెడు పురువుంబలె
ననివార్యునిఁ జేసి నన్ను, హరిహరనాథా!

౫౭

కం. వరకాంతాజనతాసుం
దరతాజాలములఁ జిక్కి, నా హృత్పతగం
బెరగొని గిజగిజలాడెడు,
నరయుము నన్నుద్ధరింప, హరిహరనాథా !

౫౮

కం. తలక్రిందుగఁ దపమైనం
జలిపి మనోరథ మొకింత సాధించుటకుం
గలదా ! మాకు స్వతంత్రత,
యలరెదు నీ కూర్మిలేక, హరిహరనాథా !

౫౯

కం. తానంబులు, నీమంబులు,
బోనంబులు విడిచి కనులు మోడ్చు జపంబుల్,
పూని మదినిల్పునే? దే
వా! నీ వెనరింత లేక, హరిహరనాథా!

౬౦

కం. పదులును వందలు వేలుగ
విదితపు యతనములు సలిపి, విసివి విసివి, యే
తుదిఁ గనక మరుని కడిమికి
నదరుచు నీ పాలఁబడితి, హరిహరనాథా!

౬౧

కం. ఇది కావలెనని కోరను,
నెది యొదవిన సమ్మతింతు నెటులేమైనన్
వదలను గృషి కర్మమునెడ,
నదవదలు దొలంచుమయ్య, హరిహరనాథా!

౬౨

కం. ననుమించు పాతకుండెటఁ
గనరాఁడనుమాట బూటకము కాదు మన
మ్మున నెమ్మిఁగ్రమ్మ సతత
మ్మనుచితమార్గముల దెసకు, హరిహరనాథా!

౬౩

కం. చేటుపడువాని నోమఁగ
గాటపు మేలందువాని గండడగింపన్
సాటిగ నవ్వగాముల, మ
మ్మాటాడింపఁగను నీవ! హరిహరనాథా!

౬౪

కం. "చేతులు కాలిన పదపడిఁ
గాతరమతి నాకులాను" కరణిని బావ
వ్రాతము పైబడ, నిత్తఱి
నాతురపడి నిన్నుఁ దలఁతు. హరిహరనాథా!

౬౫

కం. లౌకిక విషయ నిమగ్నం
బై, కేంద్రీకృతము గాక, యభ్యాసములన్
రాక, పెడతలం బట్టె న
యా! కలుషితమైన బుద్ధి, హరిహరనాథా!

౬౬

కం. జిలిబిలి వెన్నెల వెలుఁగుల
కలిమిం గులుకం దలంపఁగల పాలసుఁడన్
వలవ, నిరుణందు మెలఁగుట,
నలతి మదిం దనరువాఁడ, హరిహరనాథా!

౬౭

కం. "తక్కువ తెలివియు, నాఁకలి
యెక్కువ" యనుపెనఁగ నన్ను సృష్టించితివో,
లెక్కకు మిక్కిలి యిక్క
ట్లిక్కట! వెక్కసము దోఁచె, హరిహరనాథా!

౬౮

కం. నముఁబోలు తెలివి మాలిన
మనిసిని మనఁ జేయు ప్రోడ! మనుగడ దొడరం
జనెడుపని గడలు కొన; ని
మ్మనువుగ వెడగాని తెలివి, హరిహరనాథా!

---

ఇమ్ము † అనువుఁగన్; వెడగాని = వ్యర్థముకాని.

౧౯

కం. నీ సంకల్ప బలమ్మొక
వీసమ్మును జాలు జలధి బిందూకృతమై
గాసిల; హిమనగ మొక త్రా
ణై సంభ్రమ మొదవఁజేయు; హరిహరనాథా.

౨౦

కం. నీ సంకల్ప బలమ్మొక
వీసమ్మును జాల్ ఖగోళ విశ్వవిసరముల్
గాసిల్లి బంతులం బలె
నై, సుడివడి యెగసిపోవ; హరిహరనాథా!

౨౧

కం. ధరణిని సస్యశ్యామల
భరితం బొనరింపఁ జాలు వారిద మొకఁడే!
కరుణాసుధఁ జిలుకుచు, మ
మ్మరయఁగ నీ వొక్కరుఁడవ, హరిహరనాథా!

౨౨

కం. ననుఁ బోలి దురాశా పా
శవిబద్ధ విబుద్ధియై, విషాద నిరాశా
ఘన తాపతప్త మతియగు
ననయుఁడు లేఁడొకఁడు గావు, హరిహరనాథా,

౨౩

కం. నా సముచిత హితమును, నీ
వే సరిగా నన్నుమించి యెఱుఁగుదువు, ప్రభూ!
నీసరి యెవరున్నారు? కృ
పా సమ సుధఁ జిలుకు ఘనుఁడ, హరిహరనాథా!

౭౪

కం. నీవ కటాక్షింపఁగ వలె,
మా విపుల విపద్గణంబు మాయఁగవలెఁగా.
కీ వెడఁగు లేమిచాలుదు
రా! విమలావనపు విధికి, హరిహరనాథా!

౭౫

కం. నీ యక్కటికము బోలని
మా యత్నము పురుషకారమా! కాదు ప్రభూ!
యే యెడ, నిద్దపుటద్దం
బాయతమగు వెలుఁగు లిడునె? హరిహరనాథా!

౭౬

కం. ననలెత్తు క్రొత్త తలఁపుల
మనోలతిక, కర్మవశత, మవ్వముసెడి, క్రుం
గెను, వాడి వత్తలయ్యెడు
ననుకంపను జాటుమాలి! హరిహరనాథా!

౭౭

కం. నీ వెనరు దనరు మనిసికి
జానుగఁ బెనుకడలి నడుమ పడలెడు నిదుమల్
నీ వెనరు గననిమనుజుని,
హానియె పెనఁగొనెడు నింట, హరిహరనాథా!

౭౮

కం. లౌకిక కృతి శతమతినై
యేకడ సంతృప్తిఁ గనని హృల్లోభమునన్
జీకాకుపడి తపించుచు,
నాకాంక్షించెదను శాంతి, హరిహరనాథా!

౪౯

కం. ఇది నా జాతక బలమో!
మదిపెడి నా చేయు పనుల మఱియు ఫలమ్మో!
కదిసెడు ప్రాగ్జన్మఫలమో!
యదుపం బిడు వెతలఁ దొలఁచు, హరిహరనాథా!

౫౦

కం. అడుసునఁ బడి చిడిముడిచేఁ
గడఁ గనఁబడక కడుఁ బరుగుఁ గెంపడిఁ బుడమిన్
గడు విడుమలఁబడి యుడలుదు
నడరెడు చెడుగులకు జడిసి, హరిహరనాథా!

౫౧

కం. ఏదో బలవత్తర విధి
మాదు సిగల్ పట్టి, బిట్టు మానక, మొఱలన్
గాదని యీడ్చెడు నెటకో
యాదృతి నన్నోముమయ్య, హరిహరనాథా!

౫౨

కం. అధికార రోగ వాంఛా
మథనాయత్తము మదీయమానస మకటా!
వ్యథల విదగ్ధం బయ్యెడు
నధమస్థితి దీనిఁ దొలఁచు, హరిహరనాథా!

౫౩

కం. నా మేధా వైదగ్ధ్యము
నీ ముంగల దాఁప నేర్తునే? "తలిపుట్టి
ల్లే మేనమామ యెఱుఁగడు"
*స్వామీ! ధీబలము నిమ్ము! హరిహరనాథా!

---

* 'స్వా'లో అచ్చులేదని తెలిసియు, స్వారస్యము కొఱకిచట స్వతంత్రించడమైనది.

౭౩

కం. విషభరిత పాత్రఁ గైకొని
తృషవాపికొనంగఁ ద్రావు దీనుఁడనైతిన్
మృషయిది కావు ప్రభూ! విష
యషడ్వికారములఁ దొలఁచు, హరిహరనాథా!

౭౪

కం. "తానొకటి దలఁప దైవం
బూనుఁ బెఱతలంపు" నా బుధోత్తము లనుటల్
సూనృతములు, నీ చిత్తం
బౌనటు ననుఁగనికరింపు, హరిహరనాథా!

౭౫

కం. గాలికి వదలిన నావం
బోలి యథేచ్ఛా విహారముల పరువళ్ళన్
సోలెడుఁ జొక్కెడు, నామన
మాలింపదు సముచితంబు, హరిహరనాథా.

౭౬

కం. నిన్నేతక్క మఱొక్కని
నెన్నఁడు నే విశ్వసించి యెఱుఁగను, గొల్వన్
ఎన్నను గిడిగిళ్ళిడలే
నన్నా! చన్నే! యుపేక్ష! హరిహరనాథా!

౭౭

కం. ఎండినమ్రాఁకు చిగిర్చెడు
వెండి వసంతమున, నటులు, వృజినంబులచే
బెండువడియున్న నను నీ
వండగ మనుపంగదయ్య, హరిహరనాథా!

౮౯

కం. ఆశాపాశముచే నను
నాశన మొనరింపకు, వృజిన ప్రౌఢుఁడు గాఁ
గ్లేశముల నిడకు, విపుల స
దాశయములు తొలఁగనీకు, హరిహరనాథా.

౯౦

కం. నీతులు వలికెద నొరులకు
నీతి పథం బాశ్రయింప నేరను నాయీ
చేతో దౌర్బల్యము, దే
వా! తొలఁచుము, బలము నిమ్మ, హరిహరనాథా.

౯౧

కం. "కొట్టెద నన్న భయంబును
బెట్టెద నన, నాశ యుద్భవించుట" సతతం
బెట్టిర కైవను సాజం
బట్టిట్టన కింకఁగావు హరిహరనాథా!

౯౨

కం. సముదారాశయములు, డెం
దమున సదా కుదురుకొనఁగ నను దిద్దుమయా!
విమతుల బాటలఁ బోవని
యమలాత్మ ననుగ్రహించి, హరిహరనాథా.

౯3

కం. అసహనమను చీకుతనం
బనమంబుగ సంక్రమించి యతుళితలోభ
వ్యసనాధ్వగామి నలిపెడు
వసహాయుఁడ నన్నుఁగావు, హరిహరనాథా!

౯౪

కం. ఒరుల సమున్నతిఁ గనుగొని
యరుసంబును బడయలేని యల్పాత్ముండన్
దురహంకారుఁడ జాల్మ్రుఁడ,
నరసి ననుం దిద్దుమయ్య, హరిహరనాథా.

౯౫

కం. పరుల నధిక్షేపించెడు
పరమాధమతమ గుణంబు పాయనమయ్యెన్,
సరిదిద్దు కడిమి చేకుఱ,
దరయుము నీ ప్రోపు నొసఁగి, హరిహరనాథా.

౯౬

కం. ఈ గ్రహచారబలంబే
మో! గ్రాహ్యముకాదు, యత్నముల్ నల్పియుఁ, గా
మ గ్రాహమునకు బలిమై
వ్యగ్ర మనస్కుండనైతి, హరిహరనాథా!

౯౭

కం. ఏదో యభిశాపము నా
పై, దారుణ దాహమూని, బలవత్కామో
న్మాదిగ, సతముగఁ, బలిపెడు,
నాదట. ననునంతరింపు, హరిహరనాథా.

౯౮

కం. నా యొనరించెడు జతనము
నీ యనురాగంబు కలన నిర్విఘ్నంబై,
యే యెడ, జయమగు వరమి
మ్మా! యర్పించెద మనంబు, హరిహరనాథా!

౯౯

కం. ఎది కర్జమొ ! యెదికాదో !
మదిని వివేకింపలేని మతిహీనుఁడ, నా
యదనులఁ గని, నెఱిదిట విడి
యదవదలఁ దొలంచుమయ్య హరిహరనాథా!

౧౦౦

కం. నీ యానతి మీఱితి, న
న్యాయముఁ జేసితి, భయంకరాఘౌఘ ప్ర
జ్ఞాయుతుఁడనైతి; గతమతి
నై, యశ్రులు రాల్చుచుంటి, హరిహరనాథా!

౧౦౧

కం. పాపములు సేయుచుంటయుఁ
గాపాడఁగ వేఁడుచుంట, కడుసాజంబై
రూపఱియె, మదాత్మ బలం
బావన్నుఁడఁ గావు నన్ను, హరిహరనాథా.

౧౦౨

కం. ఘోరాత్మకాజవంజవ
నీరధిలో మునిఁగిపోయి నిత్యము సుంతన్
తీరంబుఁ జేరకడలెద
నారసి తీరంబుఁజేర్పు, హరిహరనాథా.

౧౦౩

కం. అలఘు వ్యథలను పైఁచెడు
కాలఁదిని మానవ కృతాతి ఘోరాఘంబుల్
తొలఁగునని పెద్దలాడుదు.
తలఁతి మదిం దనరువాఁడ, హరిహరనాథా.

౧౦౪

కం. గోరంత గోరమగుచో
వారక గొండంతగాఁగఁ బఱవించు వృథా
భీరు స్వాంతుఁడ నల్పుఁడ,
వారసి ననుఁ గావుమయ్య ! హరిహరనాథా.

౧౦౫

కం. జడుఁడ, దురాచారుఁడ, మూ
ర్ఖుఁడ, దురహంకార పూర్ణ కుటిలుండ, నఘా
త్ముఁడ, నను శిక్షించుహడా
హడిచే వెఱ గొల్పఁబోకు, హరిహరనాథా !

౧౦౬

కం. జాలిఁగొని నన్ను మఱవక
"పాలను ముంచెదవో ? నీటఁబడవైతువో ! " నీ
పాలఁబడి కైమోడ్చితి
నాలింపుము నాదు మొఱను, హరిహరనాథా !

౧౦౭

కం. భరమై, ఖరమై, క్షరమై,
నిరయంబై, సకలదోష నిలయంబై, యు
ర్వర నరజీవిత మతిసుఖ
హరమై, కన్పట్టుఁ, గావు, హరిహరనాథా !

౧౦౮

కం. నీ చిద్విలాస మనుపమ
ధీచతురులె యరయలేర్, తెల్ల మొగంబుల్
వైచి నిరుద్యములై, రా
హా ! భాయిదు నోటనేను, హరిహరనాథా !

౧౦౯

కం. కోటానుకోట్ల ధనమిది
గాటముగా మనిచినట్టి కరణిని దృప్తిం
జాటెద, ననామయాత్మక
హాటకమిది నన్ను సాఁకు, హరిహరనాథా!

౧౧౦

కం. చలమా! బలవత్కోపా
నలమా! యిది నీవు దారుణ స్వాంతులఁ, బా
పుల శిక్షించెడు ఛలమా!
యలమట లిటులేల యిడుదు? హరిహరనాథా.

౧౧౧

కం. జానెఁడు ప్రాఁకఁగ లోఁదలఁ
పూనినచోఁ గ్రుంగిపోదు నొక బారెఁడు, నా
పూనిక దొసఁగో! యిది క
ట్టా! నాఁపుట్టుకల చెడుగో! హరిహరనాథా!

౧౧౨

కం. కొండంతటి దేవునకుం
గొండంతగఁ బత్రి యిచ్చుకోఁగలమొక్కో!
గుండియ నుడుగర సేసెద
నండగ నీవెనరు నింపు, హరిహరనాథా!

౧౧౩

కం. కలవారి చిత్తమున, లే
ములఁ గుందెడు వారి భాగ్యముల్ విఘ్నములై
చెలఁగిన "దేవర చిత్తం
బలరఁగ నా భాగ్య" మింక, హరిహరనాథా!

# ప్రాతస్స్మరణము

౧౧౪

కం. రాతిరియంతయుఁ గాచితి
వీ తనువును వేయిఁగనుల వెసకమెసంగన్
జేతః ప్రీతిఁ గృతజ్ఞత
లాతత గతివిడుదుఁ గొనుమఁ హరిహరనాథా.

౧౧౫

కం. గురుతర బాధ్యతలను మా
శిరములఁగొని లేచుచున్న శిశువులము, శుభం
కరమగు బ్రతుకుందెరువుల
నరిగెడు ధీబలము నిమ్ము, హరిహరనాథా!

౧౧౬

కం. ఉదయార్క కరమ్ములఁబలె
విదితవినిద్రిత మనంబు విప్పారునటుల్
ముదమెసఁగు బ్రతుకుబాటల
నదలింపుము నన్నుగుణిగ, హరిహరనాథా!

౧౧౭

కం. ముకుళీకృత రాజీవము
వికసించిన భాతి బుద్ధి వికచంబయ్యెన్
వికలత్వ మెడల నడుపుమ!
అకలంక పథాలవెంట, హరిహరనాథా.

## నిద్రాసమయస్మరణము

౧౧౮

కం. మురిపెమిడు తల్లి యొడిపై
మఱచెడు శిశువట్లు, ప్రకృతిమాత్రంకమునం
దరుసమునఁ గూర్కఁగను, మ
మ్మరయుము, రేలందుఁగావ, హరిహరనాథా!

౧౧౯

కం. తలితెక్కల చాటున, న
ర్మిలిఁ బులుఁగుం బాప దాఁగురీతి, సుషుప్త్యై
జ్జ్వాల డోలం జేరెడు నను
నలఘు కృపం బ్రోవుమయ్య, హరిహరనాథా!

౧౨౦

కం. ఆసవమానినగతి, ని
ద్రాసతి మైకంబుఁ గూర్పఁ దల్పము పొలై
పీస మెఱుంగఁ దనూస్థితి
నాసించెద నీదుకరుణ, హరిహరనాథా.

౧౨౧

కం. కను ఱెప్పలఁ గొండలు వ్రా
లినవి, సుధీలతిక శోషిలినది, ప్రభూ! నీ
యనుకంపాభరశరణ
మ్మనుపం, బాశ్రయ మొసంగు, హరిహరనాథా.

౧౨౨

కం. పవలం గను కష్టసుఖముల
వివరణములు మఱచి స్వప్నవివశుండనై, సుం
త విరామము గోరెదు నను
నవిరళ దయ మనుపుమయ్య, హరిహరనాథా!

౧౨౩

కం. నిద్దుర గొనినట్టిండుఁ, బెవ
నిద్దురఁ గన్నట్టి వాఁడు నిజము సముల్ గాఁ,
పెద్దలు వల్కుదురే వెత
లద్దక ననుఁ బెనుపుమయ్య, హరిహరనాథా.

౧౨౪

కం. జీవించు నంతకాలము
నీ విమలపు భక్తి, కవనవిధి, యారోగ్య
శ్రీవిభవము, నాకిడి గరు
ణా విష్కృత దృష్టినేలు, హరిహరనాథా.

౧౨౫

కం. విరచిత కృతితతి వైక్వా
నరునకుఁ బ్రియ భక్తమై, జనంబుల పొంతన్
దొఱకె శతకములు నీదయ
యరమరలేకున్కి మూఁడు హరిహరనాథా.

౧౨౬

కం. ఈశతక పుష్పదామము
ధీశులఁ మన్ననలు వడసి పృథివీస్థలిలోఁ
బేశల సుయశః పరిమళ
మాశాభరితముగఁ గనుత, హరిహరనాథా.

౧౨౭

కం. పదితొమ్మిది వందలనలు
బదియేడవ వత్సరాంత వాసరముల స
మ్మదమున దీని రచించితి
నదిరా ! క్రీస్తుశకమందు, హరిహరనాథా !

౧౨౮

కం. చెలువారు "ద్వారకాతిరు
మల" పుణ్యక్షేత్రమునకు నమలనడుమగ ద
వ్వాలయు "దొరసాని పురమున"
నలరెడు ననుఁగావు మెప్పును, హరిహరనాథా.

౧౨౯

కం. గురుకీర్తి గొన్న యొజ్ఞను
విరచిత కృతి సంచయుండ. విమలాశయుఁడన్
వరశతకత్రితయుఁడ, న
న్నరయుము నినుఁదలఁచువాఁడ, హరిహరనాథా,

౧౩౦

కం. దీవిరచించిన పీసే
వానిరతున్, గుణగణాఢ్యు, వరమహమద్ హు
స్సేనాఖ్యుఁ, గవిత్వపద
ధ్యానపరున్, నన్నుఁగావు. హరిహరనాథా.

సంపూర్ణము

# మ త ము

పంజాబు దురంతములచే హృదంతరము పరితప్తమైన నాఁటి

రచనము - 1947 నవంబరు.

౧

కం. ఆ పంజాబు దురంతము
లా పట్టపగటి భయంకరాసురహత్యల్
చూపట్టదు నరచరితను
వ్యాపించిన ఘట్ట మేదియు, హరిహరనాథా!

౨

కం. స్వార్థపరుల్ ప్రేరేపఁగ,
వ్యర్థమతుల్ దూరదృష్టిఁ బఱుపక, ప్రళయం
బర్థివి గల్పించిరి మూ
ఢార్థోద్రిక్తాత్ములగుచు, హరిహరనాథా,

3

కం. మత లక్ష్యంబులు గానరు
మత తతికేకతను గూర్చు మార్గముఁ గనలే,
రతుకుదు రెచ్చులు లొచ్చులు
నతులిత సంకుచితమతులు. హరిహరనాథా!

౪

కం. నానామగు పెక్కు మతములు
జ్ఞానతనంబునను సృష్టి సల్పుట సర్వాం
గీణంబైన ప్రజా క
ల్యాణము వాంఛించికాదె! హరిహరనాథా,

౫

కం. మతముల పేరిట జరిగెడు
సతత నృశంసా ప్రధాన చపలాత్మక దు
ష్కృతులు గని యూరకుందువె ?
యతనంబున దిద్దవేల ? హరిహరనాథా !

౬

కం. మత విద్వేషాగ్నికి నా
హూతి యగుటయు లోక ధర్మ యుక్తంబగుచో
మతమేల మంటఁ గల్పవె ?
హతమగుటక ! భ్రాతృబుద్ధి ! హరిహరనాథా !

౭

కం. మతకర్తల సృష్టించుట
మత రూపక హనన కాండ మలయించుటకో
క్షితి నీ సంతతి కేకత
యతికించుటకో ! వచింపు, హరిహరనాథా.

౮

కం. హిందూ ముస్లిము సంస్కృతు
లం, దలపదు భిన్నగతులు లక్షించికటా !
మందులు ద్వేషాసూయల
యందముల నెక్కుచుండ్రు, హరిహరనాథా.

౯

కం. ద్రావిడు లార్యులు, బౌద్ధులు
గా, వారలె ముస్లిములుగఁ, గ్రైస్తవ తతిగా
నై , వేసము లూద్చిరి, స్వా
ర్థావహులై, భిన్నులగుచు, హరిహరనాథా !

౧౦

కం. అధికారి స్వార్థవశుఁడయి
పృథగన్యాయములొనర్చురీతి, మతములన్
అధిపులు, చేఁగొని పూర్వం
బిధమకృతుల్ సలిపినారు, హరిహరనాథా.

౧౧

కం. మతమనఁగ "నాభిజాత్యం"
బతుకుటయో ! సాటిమనుజు నధమునిగా, ధి
క్కృతిసేయుటయో ? శాస్త్రము
లతిశయముగఁ బల్కుఁజనుటో ! హరిహరనాథా.

౧౨

కం. మామత మధికశ్రేష్ఠము
మామత మెచ్చనెడువారి మాటలు కుటిల
స్వాములయెడఁదలతేటలు
నాములఁ జిలికించు నుడులు, హరిహరనాథా

౧౩

కం. మతమనఁగ బాహ్యకర్మల
పితలాటకమగునె ? చిత్త విశ్వాసరుచుల్
అతుల సజీవ ప్రోజ్జ్వల
దతిధృతి విశ్వలతగాక ! హరిహరనాథా !

౧౪

కం. అవిచలిత హృదయశుద్ధికిఁ
బ్రవిమల *సాదనములేవి, బాహ్యపుఁగర్మల్
వివిధ మతస్థులు దూషణ
లవలంబింపంగనేల ? హరిహరనాథా !

---

*సాధనములు + ఏవి

౧౫

కం. మనుజుఁడు పూర్ణుఁడౌకో, యా
తని మతము సమగ్రరూప ధన్యత్వంబున్
గనుటకుఁ. దరతమ భేదపు
టనుసంధానములఁగాక, హరిహరనాథా !

౧౬

కం. కేవల ధీకత, వాద
ప్రావీణ్యము, నఖిల జటిల పథముల నిలుపున్
జీవద్వివేకమగు చి
త్తావిష్కరణంబులేమి, హరిహరనాథా !

౧౭

కం. అగ్రజుల కహంకృతి చి
త్తాగ్రంబుల నునికి సహజ మటు గావున, వా
రగ్రము లగుదురె ? యెల్లర
నగ్రజులుగఁ జూచు విధికి, హరిహరనాథా.

౧౮

కం. అగ్రజులన ద్విజులంచును
వ్యగ్రతఁ బడయంగ దగునె ? యఖిల మతములం
దగ్రజు లున్నారుసుమీ !
యగ్రమ గౌరవములంద, హరిహరనాథా.

౧౯

కం. ధనికుల, బుధులం, దగ్రజ
జనమున ! గానంగ వచ్చు, సామాన్యులయం
దెనయుదు మత కలహము, వా
రనుకూలురు భ్రాతృమతికి, హరిహరనాథా.

౨౦

కం. ఇతర మతస్థులు "మ్లేచ్ఛులు"
క్షితిదేవుల మేము, మోక్షశిల్పుల మగుమా
మతుల కసాధ్యములేదను
నతివాదుల మాటఁ గంటె! హరిహరనాథా.

౨౧

కం. ఇతరమతస్థులు "కాఫిరు"
లతులంబగు స్వర్గసీమ కర్తలమేమే
క్షితిఁ బావనుల మటంచను
నతివాదులమాట వింటె! హరిహరనాథా!

౨౨

కం. కేవల ఖడ్గబలమ్మున
నో; విపుల స్వార్థవశతనో! కోట్లుగనై
రా! విజ్ఞభారతీయు, ల
హా! విజయులు, ముస్లిములుగ, హరిహరనాథా.

౨౩

కం. తక్కువ కొలముల వారలు
మక్కువను మహమ్మదీయ మతమును గొనిరం
చెక్కడుగఁ బల్కఁ బూనుదు
రక్కజమగు దీని విన్న, హరిహరనాథా!

౨౪

కం. ఒక మతమునగల దొసఁగులఁ,
బ్రకటిత సంకుచిత భావబంధనములు, వే
ఱొకమత సృష్టికి దోహద
మకృతకమై కూర్చుఁగాదె? హరిహరనాథా!

౨౫

కం. బలవ దధికార మున్నపు
డిల, నే మత మొరులయెడలఁ, బృథు సముదారో
జ్జ్వల సమతాభావక్రియ
లలరఁ బ్రదర్శింపఁ జాలె? హరిహరనాథా!

౨౬

కం. మును బౌద్ధారామములకు
ఘన శాతకుఠారమగుచుఁ గారింపదె? వా
సి నెగడు తద్వ్యాజ్ఞాయమున
కనలంబై, హైందవంబు, హరిహరనాథా!

౨౭

కం. జనియించిన పుణ్యస్థలి
మననీ కావలకు బౌద్ధ మతమును గెడపం
జనుకీర్తి హిందు మతమున
కనయంబై నిలిచె నౌర! హరిహరనాథా.

౨౮

కం. అలనాఁటి వీరశైవ
జ్వాలనోద్ధృతి, వీరవైష్ణవ ప్రభవ ప్రో
ద్బల హేతూద్ధతి, వినమే!
యలఘుద్విషదాహవములు, హరిహరనాథా!

౨౯

కం. ఉక్కు పెడినట్టి ద్రావిడు
లక్కలు మెయి స్వీకరించి యార్యమతముఁ బెం
పెక్కు కిరాట ద్విజులై,
రక్కాలమునందుఁ గాదె? హరిహరనాథా.

౩౦

కం. దక్షిణ దేశపు ద్రావిడు
లక్షయమగు నార్యమతము నందినమాత్రన్
దక్షులయిరొకో ! తద్ఘన
దాక్షిణత ననుభవింప, హరిహరనాథా.

౩౧

కం. అతులార్య పంచలక్షణ
తతి ద్రావిడజాతికెట్లు తగు సహజంబై
వితతాసూయలు, భిన్నత,
అతిభీరు గుణాలు దక్కె, హరిహరనాథా.

౩౨

కం. మతములు స్వార్థపరాత్మల
కతమున, మూఢాభిమాన కఠినుల కతనన్
మతి సంకోచద్వేషా
హతి నిలయములయ్యెఁగాదె ? హరిహరనాథా,

౩౩

కం. రక్కసుల యందునేనియు
వెక్కసమగు మతవిరోధ విపుల విషాగ్నుల్
పొక్కఁగ వినలేదెన్నం
డక్కట ! యిది నీకృతంబె ! హరిహరనాథా.

౩౪

కం. జంతువులకన్నఁ బృథుధీ
చాంతస్కులగు నరులందు నలరుటకన్నన్
గాంతారముల వసించుట
యంతసుఖాస్పదము కాదె ? హరిహరనాథా !

౩౫

కం. కాకుల, కోఁతుల, వృకముల
మూఁకలె, మానవుల కన్న ముప్పది రెట్లుల్
ధీకలితములన, నుచితం
బై, కన్పించెడిని నిపుడు, హరిహరనాథా!

౩౬

కం. అక్కఱ మాలి మొఱంగుచుఁ
గుక్కలు కాట్లాడినట్లు కుటిల స్వార్థుల్
నిక్కమతవైర మూనుదు,
రక్కజముగ పీతి మాలి, హరిహరనాథా!

౩౭

కం. వరమతములెల్ల, నేకే
శ్వర పూజనె చాటి బోధ సలుపుటలేదా?
చరమోన్నత సోపానం
బరయనిదే ముక్తి కనుచు, హరిహరనాథా!

౩౮

కం. నీ పంపున మతబోధ
వ్యాపారము సేయవచ్చు వారలతోడన్
నీపరమేకత్వం బే
లా! పల్కవు! వాదమడఁప, హరిహరనాథా!

౩౯

కం. మా మా జుట్లకు ముడివిడ,
నామోదించెదవ కాని, యన్యాయంబౌ
నీ మతకలహము లుడుప, న
హా! మహిమములేదె? నీకు, హరిహరనాథా!

౪౦

కం. అజ్ఞతచే మతకలహ
ప్రజ్ఞ విసర్గముగ సంభవంబగుననుచో,
సుజ్ఞాన సుధలనిడి, మా
యజ్ఞతఁ బోకార్పవేల ! హరిహరనాథా !

౪౧

కం. కొందఱు నీచులు; పూజ్యులు,
కొందఱు పుట్టువులఁ బట్టి; గొనకొనువిప్పా
డిం దలపోయుటుచితమా !
యుండఱు కారొకొ్కొ ! సములు, హరిహరనాథా.

౪౨

కం. మును ఖండాంతర కీర్తిం
గనిన మతంబులును నేఁడు గతజీవములై
ఘనత నెఁదబాసె నేలొకొ ?
యనివార్య విపర్యయముల, హరిహరనాథా.

౪౩

కం. ప్రతిభావంతుడు పూజ్యుఁడు
ప్రతిమనుజుం డనుజసముఁడు, భవ్యగుణుం డు
న్నత గౌరవనీయుఁడుగా,
నతుకదె ! సంఘవ్యవస్థ, హరిహరనాథా.

౪౪

కం. మును దేశకాల పాత్రల
కనుగుణముగఁ బెక్కుమతము లయ్యెను, యావ
జ్జను లిపుడు భ్రాతృ సుస్నే
హ నిబద్ధత మెలఁగఁ దగదె ? హరిహరనాథా !

౪౫

కం. ద్వైతాద్వైత విశిష్టా
ద్వైతముఖ ప్రముఖ భావతతిఁ బ్రతిమతమున్
ఖ్యాతిగ బోధింపదొకో
యాతత శాంతమునఁ గనిన, హరిహరనాథా.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 10 | 45 | 8 | ర్ణ | ర్థ |
| 15 | 69 | 3 | గా | భా |
| 26 | 124 | 10 | విధి | నిధి |
| 29 | 8 | 16 | యందము | యందలము |
| 31 | 17 | 11 | రగ్రము | రగ్రిము |
| 31 | 18 | 16 | రగ్రమ | రగ్రిమ |
| 35 | 38 | 15 | పరమేక | పరమైక |



# విరాళములిచ్చిన ఉదారహృదయులు

1. శ్రీయుతులు కనుపర్తి లక్ష్మీనరసింహామూర్తిగారు, తిర్లాపురమ్.
2. ,, కొమ్మిన వీరయ్యగారు, కొల్లివారిగూడెము.
3. ,, బొంతు సోమయ్యగారు, గొల్లగూడెము.
4. ,, వల్లమూడి భీమేశ్వరరావుగారు, గొల్లగూడెము.
5. ,, యలమర్తి వేంకటకృష్ణయ్యగారు, పెరుగ్గూడెము.
6. ,, రాయిపాటి రాఘవయ్యగారు, పెరుగూడెము.
7. ,, పావులూరి నాగేశ్వరరావుగారు, పెరుగ్గూడెము.
8. ,, కవితాభిమానులు,
   రేమెళ్ళ జగన్నాథరావుగారు, దుగ్గుదుర్రు.
9. ,, కవితాప్రియులు,
   రేమెళ్ళ చంద్రరాయణింగారు, దుగ్గుదుర్రు.

---

ఈ గ్రంథకర్తచే ముద్రితమైన పుస్తకములు.

1. భక్త కల్పద్రుమా శతకము
2. సుమాంజలి.
3. హరిహరనాథ శతకము.

ఈ పుస్తకములు. కోరువారలకు ఉచితముగాఁ బంపఁబడును.

చిరునామా :

మహమ్మద్ హుస్సేన్, టీచరు.
దొరసానిపాడు పోష్టు,
(వయా) భీమడోలు.
ప॥ గో॥ జిల్లా.

ముముక్షువు ముద్రణాలయము, పవరుపేట - ఏలూరు.

# హరిహరనాథ శతకము

—→o←—

(మతము)

అనుబంధములో





రచయిత :

మహమ్మద్ హుస్సేన్

టీచరు.

దారసానిపాడు.